("శ్రీరామపూజ" అనే ఈ పుస్తకం కర్త ఎవరో తెలియదు. ఈ పుస్తకం లోని 'శ్రీరామపూజాపీఠిక' అనే భాగం నాకు ఒక మిత్రుడి ద్వారా లభ్యమైనది. ఈ పీఠికలో షోడశోపచారముల గురించి విపులంగా వివరించారు. దానిని యథాతథంగా టైపు చేసి మీ ముందు ఉంచుతున్నాను. ఏ ఒక్కరికైనా ఇది ఉపయోగపడితే నేను చాలా సంతోషిస్తాను.పుస్తకం అజ్ఞాత రచయితకు నా కృతజ్ఞతలు. )

(సంకలనం మరియు టైపు: డి.నారాయణరావు, విద్యానగర్,హైదరాబాదు, తెలంగాణా రాష్ట్రం)

# శ్రీరామపూజాపీఠిక

## పూజాంగచర్య

***

దేవపూజాగృహమున దేవునిముందర నలికి, పిండి ముగ్గు పెట్టి పూజాపాత్రములనెల్ల శుద్ధిచేసి, పూజాద్రవ్యముల సంపాదించి, వానిని బరిశుద్ధపాత్రములందుంచవలెను.

స్నానముచేసి శుద్ధుడై యెండినమడివస్త్రము ధరించవలెను. దూదివస్త్రము లేనాటి కానాడు తడిపి యాఱవేయకున్న మడికి బనికిరాదు. పట్టువస్త్రములను నారబట్టలను మడితో విప్పి దాచుకొనుచుండినచో బదిదినములకొకసారి తడుపుచుండిన జాలును. కంబళులు, ధావళులు, శాలువలు ఎండలోవేసి జాడించిన మడికి బనికివచ్చును. తడుప నవసరములేదు. తడివస్త్రముతో సంధ్యావందనాది దైవకార్యముల జేయరాదు.తప్పనిచో బాగుగా బిండి యేడుమార్లు గాలిలో విదిలించి దానిని శాస్త్రార్థము పొడివస్త్రముగ నంగీకరించవచ్చును.

పూజాదులకు నేలమీద, ఉత్తపీటమీద, గూర్చుండరాదు. అట్లుచేసిన మనయందలి ప్రాణశక్తి భూమిచే నాకర్షించబడును. కావున నేలపైగాని, పీటపైగాని కృష్ణాజినమునో దర్భాసన చిత్రాసనములనో కంబళినో తుదకు వస్త్రమునో పఱచి దానిపై గూర్చుండవచ్చును.

పిమ్మట వారివారి సంప్రదాయానుసారముగ ముఖమున బుండ్రము ధరింపవలెను. పాడు మొగముతో దైవకార్యములు చేయరాదు. వలనుపడనపుడు నీటితోనైన నూర్ధ్వపుండ్రమును బెట్టుకొనవలయును. పిమ్మట మానసిక స్నానము చేయవలయును. ఆవల త్రైవర్ణికులు సంధ్యవార్చవలయును. ఆవల జపము, పిమ్మట

దేవపూజ సలుపవలయును. అవసరమునుబట్టి జపమునకు ముందు దేవపూజ చేయవలయును. దీపారాధనమున కావునెయ్యి శ్రేష్ఠము. దాని తరువాత మాహిషఘృతము, అటుతరువాత నువ్వులనూనె శ్రేష్ఠము. కాని ఆముదము మొదలైనవి వలనుపడదు. దీపపుసెమ్మెలో జమరువత్తులువేసి దీపము వెలిగించుటకై ముందు వేఱొక యడ్డవత్తిని వెలిగించి దానిచే ముఖ్యదీపమును వెలిగించవలెనుగాని పుల్లతో వెలిగించుట దోషము.

దేవపూజకు వాసనలేని పుష్పములు, దుర్గంధముగల పూలు, నల్లనిపూలు, అశుద్ధప్రదేశములందు బుట్టునవి, పురుగులుండునవి, నేలరాలినవి, పరులు వాసనచూచినవి, ధరించినవి పనికిరావు. తులసిని స్త్రీలు కోయరాదు. తులసిని బూలను గోయునపుడు గోరు తగులరాదు. కోయుటకుముందు తులసిని ధ్యానించి ప్రదక్షిణించి నమస్కరించి కోయవలెను. కృష్ణతులసితోఁ బూజచేయరాదు. దేవునికర్పించుటకై తీయుగంధమును మడితోనే తీయవలెను. ఒకసారి స్వామి కర్పించిన ధూప దీప నైవేద్యాదులు మఱియొకసారి యర్పించుటకు బనికిరావు.

మానవులందఱు నేజాతివారైనను, స్త్రీలైనను బురుషులైనను ముత్తైదువులైనను విధవలైనను శాస్త్రము విధించిన యోగ్యతానుసారముగ వారివారికి సాధ్యమైన మార్గమున, వారివారిశక్తికొలది, వారివారి విరామమునకుదగినట్లు దేవునిబూజించినపిమ్మటనే భుజించుట విధియైయున్నది. అట్లు చేయకుండిన మహాపాతకము. వేదమంత్రముల జదువ నధికారము గలవారైనను వానిని యోగ్యుడగు గురుముఖమున బఠించి సస్వరముగనే జదువవలయును. ఉచ్చారణదక్షత లేక సంస్కృతమున బఠించుటయు మంచిదికాదు.

**షోడశోపచారములు**

పూజకు షోడశోపచారములు చాలముఖ్యము. కొందఱు గంధ, పుష్ప, ధూప, దీప, నైవేద్యములు పంచోపచారములతోడనే సరిపుచ్చెదరు. కాని షోడశోపచారములు చేయుటవలన మిక్కిలి ఫలము కలుగును. ఈ షోడశోపచారములలో దేనిని జేసిన నేఫలము కలుగునో శాస్త్రములో నద్భుతముగ జెప్పబడినది. కాని గ్రంథవిస్తరభీతిచే నిచ్చట వ్రాయుట లేదు. ప్రత్యేకముగ సాలగ్రామపూజను గూర్చియు, నింకను బూజోపచారములలో గలవిశేషములను గూర్చియు, మాచే బ్రచురింపబడు 'పూజావిధి' యను గ్రంథమును జూడుడు. ప్రకృతమున శ్రీరామపూజాపరుల కుపయోగముగ నుండునట్లుగ ముఖ్యమగు నుపచారములలో నేయేద్రవ్యములను వేయవలయునో యిచ్చట వ్రాయబడుచున్నది.

అర్ఘ్యపాద్యాదులకు బంచపాత్రలు ప్రత్యేకముగ గావలసియుండును. స్వామి నభిషేకించు నభిషేకపాత్రమును నడుమ నుంచవలయును.

శ్లో ॥అర్ఘ్యపాత్రంతువాయవ్యే నైర్‌ృత్యాంపాద్యపాత్రకమ్ ।

ఆగ్నేయేస్నానకలశమైశేత్వాచమనీయకమ్॥

శ్లో ॥మధ్యేతుమధుపర్కంస్యాదిత్యేతత్పాత్రలక్షణమ్॥

---పుష్పసారసుధానిధి

అర్ఘ్యపాత్రము నభిషేకపాత్రమునకు వాయవ్యమునను, బాద్యపాత్రను నైర్‌ృతియందును, స్నానకలశము నాగ్నేయమునందును, నాచమనీయపాత్ర నీశాన్యమునను నుంచవలయును. ఈ నాల్గింటికి మధ్యను మధుపర్కపాత్ర నుంచవలయును.

**పాద్యము**

శ్లో ॥పద్మంచ విష్ణుపర్ణంచ దూర్వా శ్యామాకమేవచ ।

చత్వారి పాద్యద్రవ్యాణి లబ్ధం వాపి సమాచరేత్॥

---రత్నకోశము

పద్మము, విష్ణుపర్ణము (విష్ణుక్రాంత ఆకులు), గరిక, శ్యామాకము--ఈ నాలుగును పాద్య ద్రవ్యములు. వీనిలో నేవి లభించిన వాని నా పాద్యపాత్రజలములో వేసి యా యుపచారమును గావింపవలయును.

**అర్ఘ్యము**

శ్లో ॥కుశాక్షతతిలవ్రీహి యవమాషప్రియంగుభిః ।

సిద్ధార్థక సమాయుక్త మర్ఘ్యంస్యాత్తు విశేషతః॥

కుశలు, అక్షతలు, నువ్వులు, వడ్లు, యవలు, మినుములు, ప్రేంకణము,తెల్లావాలు నీటిలో వేసి యర్ఘ్యమునకు వాడవలెను.

లేక

శ్లో॥రక్తబిల్వాక్షతైఃపుష్పైర్దధిదూర్వాకుశైస్తిలైః।

సామాన్యస్సర్వదేవానామర్ఘ్యోzయం పరికీర్తితః॥

---రత్నకోశము

రక్తబిల్వము, అక్షతలు, పుష్పములు, పెరుగు, గరిక, దర్భ, నువ్వులు - ఇవి సామాన్యముగ సర్వదేవతలకు బనికివచ్చు నర్ఘ్యముగ నెన్నబడుచున్నది.

శ్లో॥అలాభే దధిదూర్వాదేర్మనసాపి విచింతయేత్।

ఒకవేళ నివి దొరకకున్న బెరుగు, గరిక మొదలగు వానిని మనస్సుతోనైన జింతింపవలయును

శ్లో॥ఆపః క్షీరం కుశాగ్రాణి దధి సర్పిశ్చ తండులాః।

యవాస్సిద్ధార్థకాశ్చైవ అష్టాగోzర్ఘ్యః ప్రకీర్తితః॥

నీరు, ఆవుపాలు, కుశాగ్రములు, పెరుగు, నేయి, బియ్యపుగింజలు, యవలు, తెల్లావాలు - ఈయెనిమిది యర్ఘ్యాంగములని చెప్పబడుచున్నవి.

శ్లో॥గంధపుష్పాక్షత యవకుశాగ్రతిలసర్షపైః।

సదూర్వైస్సర్వదేవానా మర్ఘ్యోzయం పరికీర్తితః॥

గంధము, పుష్పములు, అక్షతలు, యవలు, కుశాగ్రములు, తిలలు, ఆవాలు, గరికపోచలు - ఇవి సమస్త దేవతలకును నర్ఘ్యద్రవ్యములు.

శ్లో॥శంఖేకృత్వాతు పానీయం గంధపుష్పాక్షతాన్వితమ్।

అర్ఘ్యం దదాతి దేవస్య ససాగర ధరాఫలమ్॥

శంఖములో గంధపుష్పాక్షతలతో గూడిన నీటిని బోసి భగవంతున కర్ఘ్యము నొసంగిన సాగరములతోఁ గూడిన భూమినంతను దానము చేసిన ఫలము లభించును.

**మధుపర్కము**

శ్లో॥ఇక్షుర్మధు ఘృతంచైవ పయోదధి సహైవతు।

ప్రస్థప్రమాణం వా గ్రాహ్యం మధుపర్కమిహోచ్యతే॥

చెఱకురసము, తేనె, నేయి, పాలు, పెరుగు వీనిని ప్రస్థప్రమాణము గ్రహించిన మధుపర్కమగును.

**ఆచమనీయము**

శ్లో॥ఏలాలవంగ మౌశీరం కక్కోలం చ చతుర్థకమ్।

ఆచమనీయం విజ్ఞేయం యథాలాభం ప్రగృహ్యతామ్॥

యాలకులు, లవంగములు, వట్టివేళ్ళు, చలవమిరియాలు - ఈ నాలుగు ఆచమనీయమునకు గావలసినవస్తువులు. దొరికినంతవఱకు గ్రహించవలయును.

**స్నాన ద్రవ్యములు**

శ్లో॥గవాంశతస్య విప్రాణాం యద్దత్తస్య భవేత్ఫలమ్।

ఘృతప్రస్థేన తద్విష్ణో ర్భవేత్స్నా న్నసంశయః॥

ఆవునేతితో విష్ణువునకు స్నానము చేయించిన నిస్సంశయముగ బ్రాహ్మణులకు నూరుగోవుల నిచ్చిన ఫలము లభించును.

**పంచామృతస్నానము**

శ్లో॥క్షీరేణ పూర్వం కుర్వీత దధ్నా పశ్చాత్ ఘృతేనచ।

మధునాచాథ ఖండేన క్రమోజ్ఞేయో విచక్షణైః॥

---నృసింహపురాణము

ముందుగ బాలతోను, దర్వాత బెరుగుతోను, ఆమీద నేతితోను, బిదప దేనెతోను, దుదకు బటికబెల్లముతోను గ్రమముగా స్వామికి స్నానము చేయించవలయును.

**అభ్యంగనము**

శ్లో॥యః పునః పుష్పతైలేన దివ్యౌషధియుతేనచ।

అభ్యంగం కురుతే విష్ణోస్తస్య ప్రీతో భవేత్సదా॥

శ్లో॥యవగోధూమయో శ్చూర్ణై రుద్వర్త్యోష్ణేన వారిణా।

ప్రక్షాళ్యదేవదేవేశంవారుణంలోకమాప్నుయాత్॥

ఎవడు దివ్యౌషధములచే గూడిన పుష్పతైలముచే విష్ణువున కభ్యంగనము చేయునో వానియెడల భగవానుడు ప్రీతుడగును.

యవలయొక్కయు, గోధుమలయొక్కయు బిండిచే నలుగుపెట్టి వేడినీటితో దేవదేవుని నెవడు కడుగునో వానికి వరుణలోకము ప్రాప్తించును.

**జలస్నానము**

శ్లో॥తులసీమిశ్రతోయేన స్నాపయంతిజనార్దనమ్।

పూజయంతిచభావేనధన్యాస్తేభువిమానవాః॥

తులసీదళములు కలిపిన నీటితో భగవంతుని కెవడు స్నానము చేయించి పూజించునో యతడు మానవులలో ధన్యతం గాంచును.

శ్లో॥శంఖేకృత్వాతు పానీయం సాక్షతం కుసుమాన్వితమ్।

స్నాపయేద్దేవదేవేశం హన్యాత్పాపం పురాకృతం।

శ్లో॥క్షిప్త్వాగంధోదకం శంఖే యఃస్నాపయతికేశవమ్।

నమోనారాయణాయేతి ముచ్యతే యోనిసంకటాత్॥

శ్లో॥వాదిత్రనినదైరుచ్చైర్గీతమంగళసంస్తవైః।

యః స్నాపయతిదేవేశం జీవన్ముక్తో భవేద్ధిసః॥

శ్లో॥వాదిత్రాణామభావేతు పూజాకాలేచసర్వదా।

ఘంటాశబ్దో నరైః కార్యః సర్వవాద్యమయోయతః॥

శ్లో॥సర్వవాద్యమయీఘంటా దేవదేవస్యవల్లభా।

తస్మాత్సర్వప్రయత్నేన ఘంటానాదంతు కారయేత్॥

---స్కందపురాణము

**అర్థము**

అక్షత, పుష్పములతో గూడిన జలమును శంఖముతో గైకొని దేవదేవునుకి స్నానము చేయించిన బూర్వజన్మమున జేసినపాపములన్నియు నశించును.

శంఖములో గంధోదకమును బోసి కేశవుని కెవడు 'నమోనారాయణాయ' యని స్నానము చేయించునో, అతడు పుట్టిపుట్టి చచ్చిచచ్చి, పొరలవలసినపనిలేదు.

వాద్యముతోడను, బిగ్గరగా జేయుమంగళగీతస్తోత్రములతోడను దేవదేవుని కెవడు స్నానము చేయించునో, అతడు జీవన్ముక్తుడగును. ఒకవేళ వాద్యాదులు లభింపక పోయినయెడల బూజాకాలమున గంట వాయించిన

సర్వవాద్యములను వాయించినట్లేయగును. గంట సర్వవాద్య మయ మయినది. కావున సర్వప్రయత్నములతో ఘంటానాదమును జేయవలయును.

**వస్త్రమ్**

శ్లో॥అఖుదుష్టాని దగ్ధానిజీర్ణాన్యన్యైర్ధృతానిచ।

క్రిమిదుష్టానిజీర్ణాని స్థూలాన్యుపహతానిచ।

దుష్కర్మసు ప్రయుక్తాని దేవతాభిర్ధృతానిచ।

న్యూతాన్యన్యాయలబ్ధాని నస్యుశ్శస్తాని జాతుచిత్॥

ఎలుకలు కొట్టినది, కాలినది, చినిగినది, పరులు ధరించినది, క్రిములచే దూషితమైనది (చిమటలు కొట్టినది), చిల్లులు పడినది, లావైనది, నాశనము నొందినది, దుష్కర్మకుపయోగించినది, దేవతలచే ధరింపబడినది, కుట్టబడినది, అన్యాయముగ లభించినది దేవతలకు వస్త్రముగ నీయరాదు

**యజ్ఞోపవీతము**

శ్లో॥త్రివృచ్ఛుక్లంచ పీతంచ పట్టసూత్రాదినిర్మితమ్।

యజ్ఞోపవీతం గోవిందే దత్వా వేదాంతగో భవేత్॥

---నృసింహపురాణము

తొమ్మిది పోగులు కలదియు, తెల్లనిదియు లేక పసుపుపచ్చగా నున్నదియు, బట్టసూత్రాదులతో నిర్మించినదియునగు యజ్ఞోపవీతమును గోవిందున కర్పించిన వేదాంతార్థవేత్తయగును.

**ఆభరణములు (అలంకారములు)**

శ్లో॥అలంకారంచ యోదద్యాద్విప్రాయచ సురాయచ।

సోమలోకే రమిత్వాతు విష్ణులోకే మహీయతే॥

---నందిపురాణము

బ్రాహ్మణులకును, దేవతలకును నలంకారముల నెవడిచ్చునో అతడు చంద్రలోకములో నానంద మనుభవించి విష్ణులోకమును బొందును.

**గంధము**

శ్లో॥సచందనం సకర్పూరం కుంకుమాగరుమిశ్రితమ్।

మృగనాభిసమాయుక్తం జాతీఫలవిమిశ్రితమ్।

తులసీచందనోపేతం మహావిష్ణోః సుఖావహమ్॥

---నారదీయపురాణము

చందనము, కర్పూరము, కుంకుమపూవు, అగరు, కస్తూరి, జాజికాయ, తులసీగంధముతో గూడినగంధము విష్ణువునకు సుఖకరముగ నుండును.

శ్లో॥తులసీచందనాలిప్తః కురుతే హరిపూజనమ్।

పూజితేన దినైకేన లభతే లభతే శతవార్షికమ్॥

---పద్మపురాణము

తులసీగంధమును శ్రీహరి కర్పించి యెవడు పూజ చేయునో, అతడొనర్చిన యేకదివసపూజ నూఱుసంవత్సరముల పూజతో సమానము

**పుష్పములు**

భగవంతుని బూజించుటకు ముఖ్యమైన పుష్పములివి.

శ్లో॥గ్రాహ్యంసుగంధికుసుమం నిర్గంధం వర్జయేద్ధరేః।

చంపకం కరవీరంచ మల్లీజాత్యుత్పలాదికమ్।

దమనోశీరలామజ్జా తులస్యాదీన్ సమాహరేత్॥

మంచివాసనగల పుష్పములతోడనే పూజింపవలయును. వాసనలేని పుష్పములతో హరిని బూజింపరాదు. సంపెంగ, గన్నేరు, మల్లె, సన్నజాజి, కలువ మొదలైనవి. దమనము, వట్టివేరు, తులసి మొదలైన వానిని గ్రహించవలెను.

ప్రాతః కాలార్చన కీ క్రింది పుష్పములను వాడవలెను.

శ్లో॥పంకజంచ పలాశంచ తులసీవనమాలికా।

సంధ్యావర్తంచ మందారం మాధవీ చంపకం తథా।

పున్నాగం కేతకీం చాపి ప్రాతఃకాలార్చనే దశ॥

పద్మము, మోదుగపువ్వు, తులసి, వనమాలిక, సంధ్యావర్తము, మందారము, మాధవి, సంపెంగ, పున్నాగ, మొగలి అను నీ పదిరకముల పుష్పములు ప్రాతఃకాలార్చనకు ముఖ్యములు.

ఈ క్రిందనుదాహరించిన పుష్పములు మధ్యాహ్నార్చనకుఁ బనికివచ్చును.

శ్లో॥శ్వేతాబ్జం కరవీరంచ పలాశం తులసీ తథా।

ఉత్పలం బిల్వపత్రంచ రక్తోత్పల మథాపివా॥

కోవిదారైకపత్రంచ తాపసాంకురమేవచ।

ప్రోక్తాన్యేతాని పుష్పాణి దశమధ్యాహ్నపూజనే॥

తెల్లతామర, కరవీరము, మోదుగ, తులసి, కలువ, బిల్వపత్రము, ఎఱ్ఱకలువ, కోవిదారము, ఏకపత్రము, తాపసాంకురము ఈ పదియు మధ్యాహ్నపూజకు పనికివచ్చు పుష్పములు.

ఈ క్రింది పుష్పములు సాయంకాలపూజకు పనికివచ్చును.

శ్లో॥రక్తాబ్జం కుముదంచైవ మల్లికా జాతిమాలతీ।

మాధవీ కరవీరంచ హ్రీబేరం గజకర్ణికా।

తథా దమనకంచైవ సాయంకాలార్చనేదశ॥

ఎఱ్ఱతామర, కలువ, మల్లె, జాజి, మాలతి, మాధవి, గన్నేరు, హ్రీబేరము, గజకర్ణిక, దమనము ఈ పదియును సాయంకాలపూజకు బనికివచ్చును.

ఈ క్రింది పుష్పములు సర్వకాలములయందు అర్చనకు బనికివచ్చును.

శ్లో॥దూర్వాచతులసీబిల్వం కరవీరంచ చంపకమ్।

సర్వకాలార్చనార్హాణి విష్ణుక్రాంతమశోకజమ్।

బిల్వపత్రసమంరాత్రౌ కపిత్థ దళముచ్యతే॥

గరిక, తులసి, మారేడుపత్రి, గన్నేరు, సంపెంగ, విష్ణుక్రాంత, అశోకము - ఇవి సర్వకాలములయందు బూజకు బనికివచ్చును. వెలగదళము రాత్రులందు మారేడుపత్రివలెఁ బనికివచ్చును.

శ్లో॥యద్యత్పుష్పాణిచోక్తాని తత్తపత్రైశ్చపూజయేత్।

ఉత్పలస్యారవిందస్య కేతక్యాః పత్రమంతరా॥

పైనఁ జెప్పబడినపుష్పములు దొఱకకున్నా ఆ చెట్ల ఆకులతోఁ బూజింపవచ్చును. కాని కలువ, తామర, మొగలి ఈ పుష్పములు దొఱకకున్న వాని ఆకులతోఁ బూజింపరాదు.

శ్లో॥యద్దద్ద్రవ్యం భవేద్ధీనం తత్తత్పుష్పేణ కల్పయేత్।

పుష్పాణామవ్యభావేతు సర్వంతోయేన కల్పయేత్॥

పూజలో నేయేద్రవ్యములు లోపించునో వానికి బదులుగా బూలు వేయవచ్చును.ఒకవేళ నాపూలుకూడ లేకున్న నన్నియు నీటితో జరుపుకొనవచ్చును.

తులసీదళములకు భగవంతుఁడు సంతోషించినట్లు మఱియొకదానితో సంతసింపఁడు. సంక్రమణము, ద్వాదశి, శుక్రవారము, మంగళవారము, పర్వదినములు మొదలగు వానియందు తులసిని గోసిన హరిశిరమును గోసినట్లే యని చెప్పఁబడినను -

శ్లో॥నియమేనార్చనార్థంతు  తులసీంనిత్యమాహరేత్।

దినదోషోవారదోషస్తిథిదోషోనవిద్యతే॥

పూజను నియమముగాఁ జేయువారు తులసి నేదినమున గోసినను దోషము లేదు. అట్టియెడ దినదోషముకాని, వారదోషముకాని, తిథిదోషముకాని లేదు.

తులసిని గోయునపుడు చదువవలసిన మంత్రము

శ్లో॥తులస్యమృతజన్మాసి  సదాత్వం  కేశవప్రియే!

కేశవార్థం లునామిత్వాం వరదా భవ శోభనే!

ప్రసీద మమ దేవేశి! ప్రసీద హరివల్లభే!

క్షీరోదమథనోద్భూతే! తులసి!త్వం ప్రసీదమే॥

ఓ తులసీ! నీవు అమృతములోనుండి పుట్టితివి. నీవెల్లప్పుడును శ్రీమన్నారాయణునికి బ్రియురాలవు. నేను నిన్ను భగవంతునికొఱకే కోయుచున్నాను. నాకు వరము లిచ్చు దానవు కమ్ము.ఓ దేవీశిరోమణీ! ప్రసన్నురాలవగుము. ఓ హరివల్లభా! ప్రసన్నురాలవుకమ్ము. పాలసముద్రమును దఱచినప్పుడు పుట్టిన తులసీ నన్ననుగ్రహింపుము.

శ్లో॥తులస్యా  పంకజే  జాత్యా  కేతక్యా  కరవీరకే।

శస్తాని దశపుష్పాణి తథా రక్తోత్పలానిచ॥

---హరితుడు

తులసి, తామర, జాజి, మొగలి, గన్నేరు, ఎఱ్ఱకలువ - ఈ పుష్పములు పూజకు ముఖ్యములు.

శ్లో॥శ్వేతైః పుష్పైః సమభ్యర్చ్య సర్వాన్ కామానవాప్నుయాత్।

ఐశ్వర్యం ప్రాప్నుయాల్లోకే పీతైరేవం సమర్చయన్॥

శ్లో॥శత్రూణామాభిచారేషు తథాకృష్ణైస్సమర్చయన్।

సువర్ణపుష్పదానేన రాజసూయఫలం లభేత్॥

తెల్లని పుష్పములతో నర్చించిన సమస్తములైన కోరికలు నెఱవేరును. పసుపుపచ్చనిపూలతో బూజించిన నైశ్వర్యము లభించును. శత్రువులకభిచారాదులు చేయవలసినయెడల నల్లనిపూలతో బూజింపవలెను. బంగారువన్నెగల పూలతో బూజించుటవలన రాజసూయఫలము లభించును.

**ధూపము**

శ్లో॥రుహికాఖ్యంకణోదారు సిల్హకం చాగురు స్సితమ్।

శంఖోజాతీఫలం శ్రీశే ధూపాని స్యుః ప్రియాణివై॥

జటామాంసి, గుగ్గిలము, దేవదారు, అందుగుచెట్టు, జిగురు (తురుష్కము) (పాలమడ్డి), అగురు, కర్పూరము, వ్యాఘ్రనఖమను ఒక దినుసు, జాజికాయ - ఇవి విష్ణుమూర్తికి బ్రియమైన ధూపద్రవ్యములు.

**దీపము**

శ్లో॥ఘృతేన వాథ తైలేన దీపం యో జ్వాలయేన్నరః।

విష్ణవే విధివద్భక్త్యా తస్యపుణ్యఫలంశృణు॥

శ్లో॥విహాయ సకలం పాపం సహస్రాదిత్యసన్నిభః।

జ్యోతిష్మతా విమానేన విష్ణులోకే మహీయతే॥

---నృసింహపురాణము

ఆవునేతితో గాని, నువ్వులనూనెతో గాని, విష్ణువునకు విధిపూర్వకముగ దీపము నెవడు వెలిగించునో వాడు సకల పాపములను వీడి, వేయిసూర్యులతో సమానమగు కాంతితో జ్యోతిర్మయమగు విమానమున విష్ణులోకమునకు బోవును.

దీపము కర్పూరముతో నైన నీయవచ్చును.

శ్లో॥ప్రజ్వాల్య దేవదేవస్య కర్పూరేణచ దీపకమ్।

అశ్వమేథమవాప్నోతి కులకోటిం సముద్ధరేత్॥

---విష్ణుధర్మోత్తరము

దేవదేవునకు గర్పూరముతో దీపమును వెలిగించిన వ్యక్తి యశ్వమేథఫలమును బొందుటయేగాక, కోటికులముల నుద్ధరించును.

**నైవేద్యము**

శ్లో॥యద్యథాభక్ష్యతే భక్ష్యం తత్తథైవ ప్రదాపయేత్।

అన్యథా తత్ప్రదానేన న తత్ఫల మవాప్నుయాత్॥

---హలాయుధః

మనమే పదార్థములను దిందుమో వానిని భగవంతున కర్పింపవలయును. అట్లర్పింపకుండిన నా ఫలము లభింపదు.

శ్లో॥సౌవర్ణం రాజతం కాంస్యం యేన దీయేత వాయనమ్।

తాని సర్వాణి నేచ్ఛామి తామ్రంతు మమ రోచతే॥

---వారాహపురాణము

'బంగారము, వెండి, కంచు మొదలగు పాత్రలలో నైవేద్యమునుంచిన వాని నన్నిటిని నేను గోరను; నేను రాగి పాత్రనే అపేక్షింతును' అని భగవవంతుడు చెప్పెను.

శ్లో॥నైవేద్యం తులసీమిశ్రం ఘంటాద్యైర్జయనిఃస్వనైః।

నీరాజనైశ్చ హరయే దద్యాదాపోశనం తతః॥

తులసీదళములతోఁ గూడిన నైవేద్యమును ఘంటానినాదాదిజయఘోషములు చేయుచు నీరాజనము భగవంతున కర్పించి తర్వాత నాపోశనము నీయవలెను.

**తాంబూలము**

శ్లో॥పూగజాతీఫలేదత్వా జాతీపత్రంతథైవచ।

లవంగకంచ కంకోల మేలా కటుఫలం తథా॥

తాంబూలీనాం కిసలయందత్వా స్వర్గమవాప్నుయాత్।

సౌభాగ్యమతులం లోకే తథారూపమనుత్తమమ్॥

వక్కలు,జాజికాయ, జాపత్రి, లవంగములు, చలువమిరియాలు, యాలకులు, లేత తమలపాకులతో గలిపి భగవంతునకు దాంబూల మర్పించిన స్వర్గము లభించును. ఈలోకములో సౌభాగ్యము, మంచిరూపము కలుగును.

**నీరాజనమ్**

శ్లో॥బహువర్తిసమాయుక్తం జ్వలంతం కేశవోపరి।

కుర్యాదారాత్రికం యస్తు కల్పకోటి దివంవసేత్॥

శ్లో॥కర్పూరేణ చ యః కుర్యాద్భక్త్యాకేశవమూర్ధని।

ఆరాత్రికం మునిశ్రేష్ఠ!ప్రవిశేద్విష్ణుమవ్యయమ్॥

శ్లో॥మంత్రహీనం క్రియాహీనం యత్కృతం పూజనం హరేః।

సర్వంసంపూర్ణతామేతి కృతే నీరాజనే హరేః॥

చాలవత్తులతో గూడి వెలుగుచున్న ఆరతి నెవడు కేశవునిపై జూపించునో అతడు కోటికల్పములవఱకు స్వర్గమున నుండును.

కర్పూరముతో నెవడు భక్తితో కేశవునిపై ఆరతి నిచ్చునో అతడవ్యయుడైన విష్ణువును బ్రవేశించును.

భగవంతుని బూజించుటలో మంత్రహీనత, క్రియాహీనత ఏది జరిగినను వారికి నీరాజన మిచ్చుటవలన నది సంపూర్తిని బొందును.

## ప్రదక్షిణ నమస్కారము

శ్లో॥విష్ణుప్రదక్షణం కుర్వన్ యస్తత్రావర్తతే పునః।

తదేవావర్తనం తస్య పునర్నావర్తతే భవే॥

---నారదీయపురాణము

విష్ణుమూర్తికి బ్రదక్షిణము చేయుచు, నెవడు చుట్టు దిరిగి సేవింపఁగలఁడో, అట్లు తిరిగిన వానికి మరల భూమిమీదికి రావలసినపనిలేదు. అనఁగా జన్మరహితుఁడగును.

శ్లో॥ఏకా చండ్యాం రవౌ సప్త తిస్రోదద్యాద్వినాయకే।

చతస్రః కేశవే దద్యాచ్ఛివేత్వర్ధం ప్రదక్షిణమ్॥

చండికి నొకటియు, సూర్యునకేడును, వినాయకునకు మూడును, విష్ణుమూర్తికి నాలుగును,శివునకు సగము బ్రదక్షిణము చేయవలెను.

శ్లో॥కృత్వా ప్రదక్షిణం భూమౌ ప్రణమేద్దండవన్ముహుః।

పశ్యన్ దృష్ట్వాస్తువన్ వాచా మనసా చ హరిం స్మరన్॥

ప్రదక్షిణము చేసిన తర్వాత జూచి, నోట స్తుతించి, మనస్సుతో హరిని స్మరించి, భూమి మీద మరల సాష్టాంగ దండప్రణామము చేయవలెను.

శ్లో॥వస్త్రప్రావృత దేహస్తు యో నరః ప్రణమేత మామ్।

సదా స జాయతే మూర్ఖస్సప్తజన్మసు భూతలే॥

---వరాహ పురాణము

శరీరముమీద గుడ్డను గప్పుకొను యెవఁడు నాకుఁ బ్రణమించునో అతడేడు జన్మములవఱకు భూమిమీద మూర్ఖుఁడై పుట్టును

శ్లో॥ప్రదక్షిణం నకర్తవ్యం పురుషః పృష్ఠదర్శనాత్।

దేవునకు వీఁపును జూపించుచు బ్రదక్షిణము చేయరాదు.

శ్లో॥నదేవం పృష్ఠతః కృత్వా ప్రణామం క్వచిదాచరేత్।

కరముత్థాయ కర్తవ్యం నవృథా భ్రమణం చరేత్॥

శ్లో॥పశ్చాత్కృత్వాతు యో దేవం భ్రమిత్వా ప్రణమేన్నరః।

తస్యైహికఫలం నాస్తి న పరత్ర దురాత్మనః॥

దేవునకు వెనుక భాగమును జూపించుచు నెన్నటికిని బ్రణామము చేయరాదు. చేతులు జోడించి ప్రదక్షిణము చేయవలయునే గాని యూరక దిరుగరాదు. వెనుదిరిగి యెవడు దేవునకు బ్రదక్షిణము తిరిగి ప్రణమిల్లునో అట్టి దురాత్మునకు ఇహపరలోక ఫలములు నశించును.

**తీర్థప్రాశనము**

శ్లో॥తతః పతద్గ్రహా తీర్థమాదాయైన తు పూజకః|

త్రిః పిబేన్నియతో భూత్వా తులసీమపి భక్షయేత్||

పూజాంతే తులసీతీర్థం పూజకః ప్రథమం పిబేత్|

అన్యథా వినియుక్తం చేత్తత్పూజా నిష్ఫలా భవేత్॥

పూజచేసినవాఁడు ముందుగా దీర్థమును దీసికొనవలెను (మనదేశములో ముందు అందఱ కిచ్చి పూజించినవాఁడు చివరకు దీసికొనును.అది తప్పు). నియమముతో ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మిక తాపశాంతికై మూఁడు సారులు పుచ్చుకొన వలయును. తీర్థములోని తులసీదళమును దినవలెను. పూజ పూర్తికాఁగానే ముందుగా బూజచేసినవాఁడు తులసీ తీర్థమును బుచ్చుకొనవలయును. అట్లుగాక ఇంకొక విధముగ వినియోగించుచో నా పూజ నిష్ఫలమగును.

## తీర్థప్రాశన లక్షణమ్

శ్లో॥వస్త్రం చతుర్గుణీ కృత్య పాణౌపాణిం నివేశ్యచ|

తస్మింస్తీర్థం ప్రతిష్ఠాప్య త్రిః పిబేద్బిందు వర్జితమ్||

వస్త్రమును నాల్గుమడతలను బెట్టి దానిపైఁ జేతిపైఁ జేయిపెట్టి దానిలోఁ దీర్థమును పైచికొని మూఁడుసార్లు తీర్థము చుక్క, క్రిందబడకుండ పుచ్చుకొనవలెను.

## గురుపూజా విధానము

దేవపూజను మిక్కిలి దీర్ఘకాలము విరామముగా జేయనెంచువారీ పుస్తకమందలి పురుషసూక్త మంత్రములను దానివెంట సంస్కృత శ్లోకములను (వలసినచో ఆశ్లోకార్థములను దెలుపు తెలుగుపద్యములను) వాడుకొనుచు, స్వామి అభిషేక సమయమున నీపుస్తకమందలి పంచసూక్తములను వలసినచో నమకచమకముల నుపయోగించి, పూజవేళ నీపుస్తకమందలి శ్రీరామసహస్రనామములను, సీతా, అంజనేయ అష్టోత్తరశత నామములను వాడి మంత్రపుష్ప సమయమున నీపుస్తకమందలి మంత్రపుష్పత్రయము నుపయోగించి, నీరాజనమునకై యిందు ప్రత్యేకముగ జేర్చబడిన నీరాజన

వేదమంత్రములను వాడుకొనవచ్చును. ఇంకను విస్తరించి చేయనెంచినవారీ పుస్తకమందు జేర్చబడని శంఖపూజ, పీఠపూజ, షోడశోపచారములకు మఱికొన్ని వేదమంత్రములను నేర్చుకొని వాడుకొనవచ్చును. ఈ పుస్తకమందివి లేనందున బూజలో లోపమున్నదని యెంచనవసరము లేదు. దీనియందలి క్రమము పూర్ణమే. అవసరమైనంతవఱకు వ్రాయబడియున్నది. అధికముగ నెన్నైన నేర్చుకొనవచ్చును.

**లఘుపూజా విధానము**

పూజను గ్లుప్తకాలములో ముగించ నెంచువారుపచారము లన్నిటికి బురుషసూక్తమంత్రములను దానివెంటనుండు సంస్కృత శ్లోకములను మాత్రమే చెప్పుకొనవచ్చును. ఇంకను ద్వరగ ముగించవలెనన్న శ్లోకములవదలి పురుషసూక్త మంత్రములచే మాత్రమే షోడశోపచారముల జేసి ముగించవచ్చును. పురుషసూక్తమునైనను సాధించనివారు కేవల శ్లోకములచే మాత్రమే పూజించి ముగించవచ్చును. అట్లుగానిచో గేవలపద్యములతోడనే యుపచారముల నన్నిటిని జేయవచ్చును. పైవిధానము లేవియు జేతగానపుడు తాముపదేశమొందిన మూలమంత్రముచేతనే యుపచారము లన్నియు జేయవచ్చును. ఏదియు జేతగాకున్న స్వామిముందు భోజనద్రవ్యముంచి నమస్కరించి నైవేద్యమైనను బెట్టితీరవలయును. తక్కిన యుపచారములకు విరామము లేనందుకు బశ్చాత్తాపపడి స్వామిని క్షమింప వేడుకొనవలయును. కొంచెము శక్తిగలవాడు కొంచెముగనే చేయవచ్చును. శక్తికిమించి చేయనవసరము లేదు. ఒక్క యుపచారము మొదలు పేయి యుపచారముల వఱకు వారివారి శక్తిభక్తుల కొలదినే చేయవచ్చును.

కృష్ణునిదప్ప దక్కినమూర్తులను దేవీసహితులుగనే పూజింపవలయును. విగ్రహములకు బ్రతిదినము ఆవాహనమును, ఉద్వాసనమును జేయవలయును. సాలగ్రామములకవి లేవు.

శాస్త్రము భగవదాజ్ఞయే. భగవదాజ్ఞనుల్లంఘించుట శ్రేయస్కరము గాదు. ద్విజులకు మాత్రమే వేదమంత్రోచ్చారణమున కధికారము కలదని శాస్త్రము చెప్పుచున్నది. ద్విజేతరులు సంస్కృత శ్లోకములుగాని, తెలుగుపద్యములుగాని, రెంటినిగాని చెప్పుకొన నర్హులు. ఒక్కొక్క శ్లోకమునకు సరియగు నర్థము వచ్చునట్లే తెలుగుపద్యములు వ్రాయబడినవి. కనుక నాయా శ్లోకముల యర్థము నెఱుగుటకై ఆ యా పద్యములను జూడవచ్చును. పూజాదులందర్థానుసంధానము, దానివలన గలుగు భావము ప్రధానము. గ్రామఫోను యంత్రమువలె జెప్పిన బ్రయోజనము లేదు. దేవపూజకు సంస్కృతభాష ముఖ్యమైనను భావముకొఱకై తెనుగు పద్యములు చదువుకొనుట తప్పుగాదు. భావములేక చేయుటచే బ్రయోజనము చాల

దక్కువ. అర్థము తెలియకున్న భావమేర్పడదు గదా! కనుక వేదమంత్రముల సాధింపలేని ద్విజులును గేవలపద్యములచేతనే షోడశోపచారములను జేయవచ్చును.

**కీర్తన**

1.శ్రీరామజయరామ శ్రీకరశృంగారరామ! మానసపూజలుగొనుమా మానాయక శ్రీనాథా॥శ్రీరామ॥

2.ఆగమాంతసంచార! ఆవాహనమిదో నీకు। సింహవిక్రమశుద్ధాత్మా! సింహాసన మిదో నీకు॥శ్రీరామ॥

3.పాపనాశనపరమాత్మా! పాద్యంబిదిగో నీకు। అందింతు సురాసురవందిత! అర్ఘ్యం బిదిగో నీకు॥శ్రీరామ॥

4.ఆశ్రితజనఫలదాయక! ఆచమనం బిదిగో నీకు। పంచసుమాయుధజనక! పంచామృత మిదో నీకు॥శ్రీరామ॥

5.సాగరతనయాప్రియ! స్నానం బిదిగో నీకు। వరమణికుండలలసిత! వస్త్రం బిదిగో నీకు॥శ్రీరామ॥

6.ఉదధిశయన శ్రీకృష్ణ! ఉపవీతమిదో నీకు। గానలోల గజరక్షక! గంధం బిదిగో నీకు॥శ్రీరామ॥

7.చంద్రమౌళిసతీతిలక! చందనంబిదిగో నీకు। దినమణివంశతిలక! తిలకం బిదిగో నీకు॥శ్రీరామ॥

8.అఘహర నరహర కృష్ణా! అక్షతలివిగో నీకు। పుణ్యపురుష పురుషోత్తమ! పుష్పంబు లివే నీకు॥శ్రీరామ॥

9.దుర్వార ఘనశ్యామ! ధూపంబిదిగో నీకు। దీనజనావన దక్ష! దీపం బిదిగో నీకు॥శ్రీరామ॥

10.నైర్మల్యానందభరిత! నైవేద్యమిదో నీకు। తారాపతివిధ్వంసక! తాంబూలమిదో నీకు॥శ్రీరామ॥

11.నీరజలోచన! నిత్య నీరాజన మిదోనీకు। మంగళాలయ మధుసూదన! మంత్రపుష్పమిదో నీకు॥శ్రీరామ॥

12.ప్రహ్లాదభయవిదూర! ప్రదక్షిణ మిదో నీకు। భక్తవత్సల భవనాశన! భవనీరధి దాటించుము॥శ్రీరామ॥

13.జలజాతనయన రామ! ఛత్రంబిదిగోనీకు। జానకీహృదయలోల చామరం బిదిగో నీకు॥శ్రీరామ॥

14.నారదగానవిలోల! నాట్యం బిదిగో నీకు। గోవర్ధనధర! గీతం బిదిగో నీకు॥శ్రీరామ॥

15.మాధవ గోవింద కృష్ణ!మనసిజశతకోటిరూప!మణిమయభూషణధర!మంగళం బిదిగో నీకు॥శ్రీరామ॥